# శంకర భగవత్పాదుల
# భజగోవింద శ్లోకాలు





సగ్రంథీకరణ

**పెమ్మరాజు భానుమూర్తి**

సాక్షిగణపతి పబ్లికేషన్స్
గవర్నరుపేట, విజయవాడ-2

## శంకర భగవత్పాదులు

ఎల్లెడలా అలముకొన్న అశాంతిని పారద్రోలి అధర్మాల్ని అణచివేసి ధర్మాన్ని స్థాపించడం కోసం ప్రతి యుగంలోనూ అవతరించగలనని భగవానుడు నుడివినట్లు యిది గీతాచారుని భాష్యం.

భారతదేశ చరిత్రలో యిటువంటి కొన్ని ఘట్టాలు జరిగాయి. అటువంటి ఘట్టాలలో ఒకటి యిది.

భారతదేశం కర్మభూమి. ఈ కర్మభూమి మత సంక్షోభంలో చిక్కుకున్న సమయం హిందూ మతం భవితవ్యం ఏమిటి అన్న ప్రశ్న తలెత్తుతున్న సమయం.

దేశంలో ఉత్తరభాగం తురుష్కుల దండయాత్రలకు గురి అయింది. సంక్షుభితం అయింది. ఆ దశలో హిందూ మతం నశించనున్న సమయంలో హిందూమత ఉద్ధరణ కోసం ఒక మహాపురుషుడు ఉద్భవించాడు. ఆయనే ఆది శంకరులు.

## జననం :

ప్రస్తుత కేరళ రాష్ట్రి చూర్ణానది ఒడ్డున కాలడి అన్న గ్రామం వుంది. చిన్నగ్రామం. ఆ గ్రామంలో ఇంచుమించుగా అంతా బ్రాహ్మణులే!

ఆ గ్రామంలో విద్యా సంపన్నమైనది నంబూద్రి కుటుంబం. శివగురు, ఆర్యాంబ అనే దంపతులు వుండేవారు. ఆ కుటుంబం సదాచార సంపన్నం.

వివాహం అయి చాలాకాలం అయినా ఆ దంపతులకు సంతానం కలుగలేదు. యాత్రా సేవనం వలన సంతతి కలుగ వచ్చునన్న భావం వారికి కలిగింది. తమలో తాము ఆలోచించుకున్నారు.

ఆ భావనతో తిరుచ్చూరు శివాలయాన్ని సందర్శించారు.

తిరుచ్చూరు శివాలయం ప్రసిద్ధమైనదే ఆలయ సందర్శనం వలన భక్తుల కోరికలు ఈడేరగలవని నమ్మిక నేటికీ వుంది.

శివగురు దంపతులు : శివగురు దంపతులు భక్తి ప్రపత్తులతో ఆరాధించారు. కారణం అదే అవునో కాదో తెలియదు కాని ఆ విధంగా తిరుచ్చూరు శివాలయాన్ని అర్చించిన అనంతరం ఆర్యాంబ గర్భం దాల్చింది.

అయితే ఈ సందర్భాంగా మరొక విషయం గమనించ వలసివుంది. కేరళలో ఒక కథ వాడుకలో వుంది. శివగురు దంపతులు తిరుచ్చూరు వెళ్ళేరట. పరమశివుని అర్చించారట.

ఆ రాత్రి ఆ దంపతులు యిరువురికి ఏకకాలంలో కల వచ్చిందట. ఆ కలలో ఒక వృద్ధుడు కన్పించాడట.

ఆ దంపతులను ప్రశ్నించాడు.

"దీర్ఘాయువు కలిగిన అనేకమంది పుత్రులు కావాలా- లేక వంశగౌరవాన్ని దశదిశలా వెదజల్లే వాడు ఒక్కడు కావాలా- అనేకమంది సంతానం జ్ఞానహీనులే అవుతారు. మహాజ్ఞాని అల్పాయుషువు అవుతాడు"

వృద్ధుని ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేక పోయారు ఆ దంపతులు. వారికి సమాధానం తోచలేదు.

ఒకవంక ఆనందం. ఉబ్బి తబ్బిబ్బు అయ్యారు. తమకు సంతానం కలుగబోతోంది. తిరిగి ఈ ప్రశ్న—ఏం చెయ్యాలి ఏం చెప్పాలి,

ఆ నిర్ణయాన్ని కూడా తాము నమ్మిన శంకరునికే వదలి పెట్టారు దంపతులు.

అపుడు శంకరుడు తానే ఆది శంకరులుగా వారికి సంతానంగా కలుగ గలనని చెప్పారట.

ఇది విన్నారు ఆ దంపతులు వారి సంతోషానికి అవధి లేదు—

అది కల-ఆ కల, ఆ కలను గూర్చిన కథ నిజం అవునో తెలియదుగాని-ఇది జరిగిన చాలా కొద్ది కాలానికి శివగురు దంపతులకు పుత్రోదయం అయింది. వారా బాలునికి శంకరులు అని పేరు పెట్టారు. శంకర నంబూద్రి ఈవిధంగా జన్మించినట్లు పాడుకలోవున్న కథలు తెలుపుతున్నాయి.

చాలామంది ప్రముఖుల జనన తేదీలు కాలగర్భంలో కలసిపోయిన విధంగానే శంకరులు జన్మించిన కాలం కూడా ఇతిమిద్ధంగా తెలియకుండావుంది. శంకరుని జనన తేదీని గురించి చరిత్రకారులు ఫలాన అని తేల్చి చెప్పలేక పోతున్నారు.

అయితే అందిన సాక్ష్య ఆధారాలనుబట్టి యితర చారిత్రక అంశాలనుబట్టి పూరి, ద్వారక, బదరికాశ్రమ పీఠాల చరిత్రలనుబట్టి పరిశీలన జరుపడం జరిగింది. 499-509 సంవత్సరాల మధ్య కాలంలో ఆయన జన్మించి వుండవచ్చని నిర్ధారించడం జరిగింది.

ఆయన జీవించినది చాలా స్వల్పకాలం కనుక అంటే కేవలం 32 ఏళ్ళు కనుక ఆయన జీవిత కాలం 499-467 లేదా 509-477 సంవత్సరాల మధ్యకాలం అయివుండవచ్చు. అయితే ఇవంతా కేవలం ఊహాజనితమైన నిర్ణయమే కాని ఇతమిద్ధంగా ఖచ్చితంగా ఇది అని చెప్పలేం.

## జనన కాలం - తర్జన భర్జనలు :

ఆదిశంకరాచార్యులవారి జననం గూర్చి అనేక వాదనలు విన్పిస్తున్నాయి. పైన చెప్పినది ఒక వాదన. శంకర పీఠాలలో ప్రధానమైనదిగా చెప్పబడుతున్న శృంగేరి పీఠం లోని రికార్డులనుబట్టి యితరత్రా ఆధారాలనుబట్టి చూచినట్లయితే శంకరుల జననం క్రీ.పూ 544 సంవత్సరాల క్రితం అయివుండాలి.

అయితే చరిత్ర పరిశోధకుల భావన ఇందుకు భిన్నంగా వుంది. చరిత్ర కారులు ఆదిశంకరులు క్రీస్తుశకం 788-820 మధ్య కాలంలో జీవించి వుండాలి అని అభిప్రాయ పడుతున్నారు. ఇదే విధంగా శంకరుని జనన కాలం గురించి ఎన్నో తర్జన భర్జనలు వున్నాయి. అయినా ఒకటి మాత్రం నిశ్చయంగా ఇటు పరిశోధకులుగాని అటు చరిత్రకారులుగాని ఒక విషయం చెప్పగలుగుతున్నారు. ఆదిశంకరులు మహాకవి కాళిదాసు, వాచస్పతికి మధ్య కాలంలో జీవించి వున్నారు అనేది స్పష్టం.

నాటికి నేటికి ఏ నాటికి భారతదేశ చరిత్రలో భారతీయుల జీవన స్రవంతిలో పెనవేసుకొని వున్న శంకరాచార్యులు జీవించి వున్నది బహు తక్కువ కాలం. కేవలం 32 ఏండ్లు. ముప్పది రెండేళ్ళ అత్యంత స్వల్ప కాలంలో ఆయన ప్రపంచాన్నే శాసించారు. ఆ శాసనం నేటికి ప్రవర్ధిల్లుతూనే వున్నది. యింకా పరిడవిల్లుతుంది. ఆయన అనంతం. ఈ ప్రపంచం ఉన్నంత కాలం ఆయన కూడా వుంటారు. అది సత్యం.

జగద్గురు ఆదిశంకరాచార్యులు మహా ప్రతిభావంతుడైన తత్త్వవేత్త. అద్వైతామృత సారాన్ని, అనన్య సామాన్యమైన రీతిలో ఆమోద యోగ్యమైన తీరులో వైదికులకు అందించిన గొప్ప దార్శనికులు శంకరాచార్యులు. ఇంతటి మేధావి, కరుణామూర్తి, సామాజిక సంస్కర్త, మహోన్నత సహనశీలి మరొకరు ఉంటారా అనిపించే పుణ్యపురుషుడు ఆదిశంకరులు. అందుకే ఎంతోమంది ఈ మహానుభావుని సాక్షాత్తూ పరమేశ్వర

స్వరూపంగా భావించి ఆరాధిస్తూ ఉన్నారు. ఇతడు భౌతికంగా గతించి 1200 సంవత్సరాలు దాటుతున్నా ఇంకా సజీవుడిగానే ఉండడం ఎవరినయినా విస్మయానికి గురిచేస్తుంది.

శృంగేరి మఠం వారి సమాచారం ప్రకారం శంకరాచార్యులు క్రీ. శ. 648-716 మధ్య కాలానికి చెందినవాడు. అయితే కృష్ణ బ్రహ్మానందుడు రాసిన "శంకర విజయం"లో, నీలకంఠ భట్టు రాసిన "శంకర మందార సౌరభం"లో శంకరాచార్యులు క్రీ. శ. 788 లో పుట్టి 820 లో మరణించినట్లు ఉంది. కేరళ రాష్ట్రంలో వున్న కాలడే అనే గ్రామంలో నంబూద్రి బ్రాహ్మణ కుటుంబంలో ఇతడు పుట్టినట్లు కొందరి అభిప్రాయం. ఆనందగిరి అనే తత్త్వవేత్త మాత్రం శంకరాచార్యులు చిదంబరంలో పుట్టినట్లు "శంకర విజయం"లో రాశాడు. శంకరాచార్యుల తండ్రి శివగురువు. తల్లి పేరు సతి. తండ్రి శంకరాచార్యుల ఉపనయనానికి ముందే చనిపోయాడని ఎక్కువమంది చెబుతుండగా "మణిమంజరి" అనే మాధ్వ గ్రంథంలో శంకరాచార్యులు తండ్రి గతించాకే పుట్టినట్లు వుంది.

తల్లిని ఒప్పించి ఎనిమిదవ ఏట సన్యాసాన్ని స్వీకరించిన శంకరాచార్యులు వేదాంత సారాన్ని, అద్వైత సాధనను నర్మదానదీ తీరాన ఉండే గోవిందుని వద్ద నేర్చుకున్నాడు. గౌడపాదుడు గోవిందునికి గురువు మాత్రమే కాగా, శంకరాచార్యులకు పరమగురువు!

శంకరాచార్యులు ఎనిమిదవ ఏటనే చతుర్వేది అయ్యాడు. పన్నెండేళ్ళకు సర్వశాస్త్ర వేత్తగా భాసించాడు.

పదహారేళ్ళకు భాష్యకారుడిగా ఎదిగాడు. ఇంతటి ప్రజ్ఞా పాట వాలు ప్రదర్శించిన పరమ కుశాగ్రబుద్ధి కనుకే అవతార పురుషుడు అయ్యాడు. అఖిల భారతీయుల ఆరాధ్య గురువర్యుడయ్యాడు. విశ్వవాప్తంగా వైదిక సంప్రదాయ వైభవాన్ని దశదిశలా వెలుగొందింప జేసాడు. తర్క వితర్కాల శాస్త్ర చర్చలో భారతీయులకు తిరుగులేదని రుజువు చేసాడు. అమరుడై అనితర సాధ్యుడై నిలిచే ఉన్నాడు.

శంకరాచార్యులను ప్రచ్ఛన్న బౌద్ధుడని కొందరు విమర్శిస్తే, అవైదికుడని మరికొందరు అంటారు. శంకరాచార్యుల పై బౌద్ధ మత ప్రభావం ఉండీ ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఆ మాటకు వస్తే ఇతర మతాల ప్రభావం కూడా అతడిపై ఉందని చెప్పవచ్చు. సర్వమతాల సారాన్ని, సారాంశాన్ని ఆకళింపు చేసుకొన్న విశ్వ విజ్ఞానవేత్త ఆదిశంకరులు. అతని భావాలను అర్థం చేసుకోవడానికి మెదడు మాత్రమే సరిపోదు. హృదయం కూడా కావాలి! ఆత్మగతమైన సంస్కారం తప్పని సరిగా ఉండి తీరాలి!!

ఆదిశంకరులు రాసినన్ని విషయాలు ఈ ప్రపంచం మొత్తం మీద మరెవరూ రాసి ఉండరు. అందుకే కాబోలు కృతయుగంలో దక్షిణామూర్తి, ద్వాపరయుగంలో వేద వ్యాసుడు, ఈ కలియుగంలో ఆదిశంకరులు అని కొంతమంది అంటూ ఉంటారు. కేవలం 32 ఏళ్ళకే దేహయాత్ర ముగించిన ఇతడు ఇన్ని గ్రంథాలను రాసి ఉంటాడా అనే సందేహం ఎవరికైనా వస్తుంది. అంతేకాదు ఆదిశంకరుల పేరుతో ఇంకా

వేరేవారు ఉన్నారేమో నన్న అనుమానం కూడా వస్తుంది. ఈ అంశంపై ఇప్పటికే పండిత ప్రకాండులు వాదులాడుతూనే ఉన్నారు!

బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీతపై శంకరాచార్యులు భాష్యాలు రాసినాడు. ఈ మూడింటిని కలిపి ప్రస్థాన త్రయమని కొందరు పిలుస్తారు. అపరోక్షానుభూతి, పంచీకరణము, ఉపదేశ సాహస్రి, ప్రబోధ సుధాకరము, వివేక చూడామణి, శతశ్లోకి, భజగోవిందం, శివానందలహరి, సౌందర్య లహరి మొదలైన గ్రంథాలను ఎన్నింటినో రాసిన ఖ్యాతి శంకరాచార్యులకే దక్కుతుంది.

శంకరులు చూపిన మహిమలకు అంతులేదు. చిత్ర విచిత్రమైన ఉదంతాలకు కొదవలేదు. ఇతని ఔదార్యం వెల కట్టలేనిది. పేద బ్రాహ్మణ దంపతుల కోసం లక్ష్మీదేవిని స్తుతించి "కనకధారా స్తవం" సృష్టించి వారికి ఐశ్వర్యం కలిగేలా చూచాడు. అంత శక్తి ఉండి కూడా అతి సామాన్యమైన జీవితాన్ని అతడు గడపడం సర్వమానవ సమానత్వానికి, మాన్య మానవ మానవతా దృక్పథానికి ప్రత్యక్ష దృష్టాంతమని అనుకోక తప్పదు. ఎప్పుడూ పాదచారిగానే తిరుగాడే శంకరుల సంస్కారణ, సౌశీల్యం, సౌమనస్యం, సౌజన్య స్వభావం అవధులు లేనివి. మూకాంబికా క్షేత్రానికి వెళుతూ మరణించిన ఒక బ్రాహ్మణ బాలుని బతికించడం, మందమతులైన హస్తామలకుడు, ఆనందగిరిని విజ్ఞాన ఘనులను చేయడం, తన తల్లికే మాయ గురించిన బోధ చేయడం, సాక్షాత్తు పరమశివుడే ప్రత్యక్షం కావడం ఇతని మహా పురుష

తత్త్వాన్నీ, దివ్యాంశ ప్రాభవాన్నీ వెల్లడి చేస్తాయి. ఎన్నో కల్పనలు ఉండవచ్చు. మరెన్నో కథలు చేరి ఉండవచ్చు. ఇవన్నీ కూడా ఆదిశంకరుల వ్యక్తిత్వ ప్రమాణాన్ని మరింతగా పెంచుతాయే తప్ప వీటివల్ల ఏమాత్రం నష్టమూ లేదు. మహాపురుషుల కాల నిర్ణయంపై వాదోపవాదాలు చేయడంకన్నా వారి సందేశాల గురించి ప్రతినిత్యం చర్చించుకోవడం ఎంతైనా సముచితంగా వుంటుంది!

ఆదిశంకరులు ఎనిమిదో ఏటనే అన్ని శాస్త్రాలలో వేదో వేదాంశాలలో పాండిత్యం సంపాదించారట. తర్కం వ్యాకరణం మీమాంసలలో ఆయన అందె వేసిన చేయి. 12వ ఏడు వచ్చేసరికి అన్ని శాస్త్రాలు మధించి వేసారు. వేదాలకు భగవద్గీతకు భాష్యం వ్రాశారు.

ఈ సమయంలో దేశ కాల పరిస్థితులు బాగాలేవు. అధ్వాన్న స్థితిలో వున్నాయి. విదేశీయులు, హూణులు, తురుష్కుల దండయాత్రలు అధికం అవుతున్న సమయం. దేశాన్ని జాతిని సంస్కరించవలసిన సమయం. మతాన్ని సంరక్షించుకోవలసిన సందర్భం.

శంకరాచార్యుల వారు తమ వంతు బాధ్యతను గుర్తించారు. ఆసేతు హిమాచల పర్యంతం పర్యటించారు. తాను నమ్మిన ప్రవచించిన అద్వైత సారాన్ని వ్యాప్తి గావించారు. దేశంలో అప్పుడప్పుడే ప్రాదుర్భవిస్తున్న నాస్తిక వాదాన్ని పారద్రోలారు.

ఏ విధమయిన సదుపాయాలు లేని ఆ రోజుల్లో

శంకరాచార్యుల వారు ఈ బృహత్తర కార్యక్రమాన్ని నిర్వర్తించారు.

## భజగోవిందం :

శంకరాచార్యులు ప్రవచించినవి ఎన్నో. అందులో భజగోవింద శ్లోకాలు ఒకటి. చిన్నది, ప్రాముఖ్యమైనది అయిన ఈ గ్రంథ రచన సాఫీగా సాగింది. మృదువుగా, గంభీరంగా, సరళంగా ఆఖరికి చిన్నవారికి కూడా అర్థమయ్యే రీతిలో వ్రాయబడింది.

ఈ భజగోవిందంలో ప్రస్తుతం వాడుకలో వున్న శ్లోకాల సంఖ్య 31. ఈ శ్లోకాలు అన్నీ శంకరాచార్యులు చెప్పినవి కావు. ఆయన 17 శ్లోకాలు చెప్పారు. ఆయన వెంటగల శిష్యులు వరుసగా మరో 14 శ్లోకాలు చెప్పారు.

ఈ భజగోవింద శ్లోకాలను మోహముద్గర అని అంటారు. ఈ శ్లోకాలను చెప్పడానికి గల కారణానికి సంబంధించి ఒక కథ కూడా వుంది.

ఈ భజగోవింద శ్లోకాలలో మొదటి శ్లోకాన్ని ప్రతి శ్లోకం చివర పల్లవిలా పాడుతూ వుంటారు. పుస్తకం చిన్నదే. పిట్ట కొంచమే అయినా కూత ఘనం అన్నట్లు ఈ చిన్న పుస్తకంలో గల భావం అనంతం. అద్వైత మత సారమంతా యిందులో నిబిడీకృతమై వుంది. యిందులో చెప్పడం కన్పిస్తుంది. వాదన కనపడదు. తర్కానికి స్థానం లేదు.

రచనా సంవిధానం గమనించినట్లయితే ఇది అపురూపమైనదన్న విషయం ఎవరూ కాదనలేరు.

తర్కానికి తాత్విక వాదానికి అవకాశం లేనట్టిదిగా ఈ

గ్రంథం రూపొందించబడింది. తార్కికుడు తాత్వికులు కన బడరు. బోధించే గురువు మాత్రమే కనబడతాడు.

భాష సరళం, లలిత మృదులం. భావం అనంతం, అపు రూపం. చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పేది. అందుచే ఇంతగా బహుళ ప్రజాదరణ పొందింది.

ఈ శ్లోకాలు ఏ కారణం వలన చెప్పిన ప్రబోధకాలు. మనిషి వెన్వెంటనే మేలుకోవలసిన అగత్యాన్ని తెలిపే మేలు కొలుపు. సంసార సాగరంలో పడివున్న వారు ఆ భవబంధాల నుండి వెలికి వచ్చి మనిషి జన్మకు సార్థకతను గ్రహించవలసి నదిగా చెప్పే అంశాలు ఇందులో పొదిచేసి వున్నాయి.

భజగోవింద శ్లోకాలుగా బహుళ ప్రజాదరణ పొందిన ఈ మోహముద్గర ఆదిశంకరుల వారి అసంఖ్యాక గ్రంథాలలో ఒకటి, అతి చిన్నది. సర్వ వేద వేదాంతసారం యిందులో ఇమడ్చబడింది. శాస్త్రాలు, పురాణాలు అధ్యయనం చేయ లేని వారికి ఇది హస్తభూషణం. అత్యంత శబ్ద సౌందర్యంతో చిన్నపిల్లలకు కూడా అర్థమయే భాషలో వ్రాయబడిన స్తోత్రం యిది.

ఈ గ్రంథం చిన్నది. బడిపిల్లలు చదువుకొనేది అనే అనుకుంటే అది పొరపాటే. జీవితాన్ని మథించిన గ్రంథం యిది.

ఈ గ్రంథాన్ని గురించి కథ ఒకటి వాడుకలో వుంది. భజగోవింద శ్లోకాలు ఆదిశంకరుల వారు ప్రవచించడానికి సంబంధించిన కథ యిది.

## ముందు కథ:

ఆదిశంకరులవారు ఒకసారి తమ పర్యటనలో భాగంగా కాశీనగరం వేంచేశారు. ఆ సందర్భంగా ఒకరోజున గంగా స్నానం చేద్దామని శిష్యులతో బయలుదేరారు.

ఓ స్నాన ఘట్టానికి సమీపంలో ఒక వృద్ధుడు, మహా పండితుడు అయి వుండవచ్చు. కూర్చుని వ్యాకరణ సూత్రాలు వల్లె వేస్తున్నాడు. త్రికాలజ్ఞాని అయిన శంకరాచార్యులవారికి ఆ వృద్ధ వ్యాకరణ పండితుని చూస్తే జాలి వేస్తుంది. అతని దగ్గరకు వెళ్ళారు. "మహాశయా" అని పిలిచారు. ఆ వృద్ధుడు తలెత్తి చూసాడు పాండిత్యం. ఆయన వదనం దివ్య తేజంతో, వెలుగులతో వుంది.

"నేను తర్క మీమాంస వ్యాకరణాలలో ఘనాపాఠీని" అన్నారు.

శంకరాచార్యుల వారికి నవ్వు వచ్చింది. "మీరు పండితులే! ఎవరు కాదనగలరు? కాని ఈ వ్యాకరణం, ఈ సూత్రాలు, ఈ తర్కం మీమాంస మన జీవనానికి ఉపయోగిస్తాయేమోగాని జీవితానికి ఏ విధంగానూ వుపకరించవు. నీవు చేసిన మంచి చెడులే నీ తదనంతరం కూడా నిలిచి వుంటాయి. నీ దృష్టిని గోవిందుని ధ్యానంవైపు మరల్చు. జీవితం సార్థకం అవుతుంది, ధన్యమవుతుంది" అని అప్పటి కప్పుడు ప్రస్తుతం వాడుకలో వున్న భజగోవింద శ్లోకాలలో మొదటి శ్లోకాన్ని చెప్పారు. అదే-

భజగోవిన్దమ్
భజగోవిన్దమ్
గోవిన్దమ్
భజమూఢమతే
సంప్రాప్తే
సన్నిహితకాలే
నహినహి రక్షతి
డుకృఞ్కరణే

## ద్వాదశ మంజరిక స్తోత్రం

భజగోవింద శ్లోకాలకు ఈ విధంగా అంకురార్పణ జరిగింది. ఈ శ్లోకం చెప్పిన శంకరులవారు ధారగా వరుసగా మరో పన్నెండు శ్లోకాలు చెప్పారు.

ఈ పన్నెండు శ్లోకాలను అద్వైతులు ద్వాదశ మంజరికా స్తోత్రంగా ప్రస్తుతిస్తారు.

ఆ క్షణం గడిచిపోయింది. ఆ క్షణం అనంతరం ఆ సమయంలో ఆయన వెంటవున్న 14 మంది శిష్యులు వరుసగా 14 శ్లోకాలు చెప్పారు.

చివరగా ఆదిశంకరులవారు మరో నాలుగు శ్లోకాలు చెప్పారు.

ఈ విధంగా భజగోవింద శ్లోకాలు ఏర్పడ్డాయి. అంటే శంకరులు మొదట చెప్పిన శ్లోకం తదనంతరం 12 శిష్యులు చెప్పిన 14 శ్లోకాలు చివరగా శంకరులు చెప్పినవి నాలుగు మొత్తం 31 శ్లోకాలు ఈ భజగోవింద శ్లోకాలుగా వాడుకలో ప్రసిద్ధినొందాయి.

పిట్ట కొంచెమే! శంకరులవారు ప్రవచించిన గ్రంథాలన్నింటిలోనూ చిన్నదే అయితే అత్యంత ప్రాముఖ్యమైనట్టిది.

చివరగా చెప్పిన నాలుగు శ్లోకాలు అత్యంత ప్రాముఖ్యత సంతరించుకున్నాయి.

కోరే మనిషిని ఆశీర్వదించేవిగా వాటికి అత్యంత ప్రాముఖ్యత ప్రాచుర్యం వున్నాయి.

* * * *

చివరిగా ఓ మాట ఈ భజగోవింద శ్లోకాలను మోహముద్గర అంటారు.

మొదటి శ్లోకాన్ని ప్రతి శ్లోకం చివర పల్లవిలా పాడుతుంటూ వుంటారు.

ఇక చదవండి ;

## ద్వాదశ మంజరిక

"భజగోవిన్దం భజగోవిన్దం
భజగోవిన్దం మూఢమతే
సంప్రాప్తే సన్నిహిత కాతే
నహినహి రక్షతి డుకృఞ్ కరణే

ఓ మూఢుడా! గోవిందుని భజించు! గోవిందుని భజించు భజించు గోవిందుని — మరణ కాలం ఆసన్నమయినపుడు వా[illegible] సూత్రాలతో జీవించి వున్నప్పుడు నీ వెంట వు[illegible]ఏవీ నిన్ను రక్షించలేవు.

* * *

గోవిందుని భజించడం తప్ప ఈ లోకంలో మరేదీ మనిషిని రక్షింప జాలదన్న భావం! ఈ కర్మభూమి అని ధర్మ శాస్త్రాలు పురాణాలు ఈ విషయాన్నే చెపుతున్నాయి.

అహం బ్రహ్మ అన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన అద్వైతవాద స్పష్టికర్త ఈ విధంగా సద్గుణ రూపాన్ని గోవిందుని ఆరాధించమంటారా! తానే బ్రహ్మమని అన్న వ్యక్తి తాను వేరు బ్రహ్మము వేరు అని అంగీకరించినట్లే కదా! అని కొందరు భావించవచ్చు.

గోవు అన్న పదానికి అన్వయించినట్లు కొందరు, శంకరుల గురుపాదులు గోవిందాచార్యులను స్మరించినట్లని కొందరు ఈ విషయంలో భావిస్తున్నారు. ఇంకా ఇటువంటివి కొన్ని వాదాలు వున్నాయి.

విషయ పరిశీలనకు వస్తే— జాతస్య మరణం ధ్రువమ్! పుట్టిన వ్యక్తి గిట్టక తప్పదు. మరణాన్ని ఏదిగాని ఎవరుగాని ఆపలేరు. ఐహిక విషయాలుగాని, వ్యాకరణ తర్క మీమాంసాది శాస్త్రాలుగాని ఏవీ రక్షించలేవు. (డుకృఞ్ కరణే అన్నది వ్యాకరణ సూత్రం)-

భజ అంటే భజన కాదు. చప్పట్లు కొట్టడమో, తాళాలు వేయడమో, చెక్కభజన చేయడమో కాదు. దైవాన్ని నామ మాత్రంగా స్మరించడం అసలే కాదు.

భజ అంటే భజించడం- భక్తి జ్ఞాన వైరాగ్య తత్వాలతో భగవంతుని ఆరాధించడం- కీర్తించడం.

మహా భాగవతంలోని ప్రహ్లాద చరిత్రలో భక్తిని గూర్చి

పోతన మహాశయులు తొమ్మిది విధాలుగా చెప్పాడు. శ్రవణం, కీర్తనం, సేవనం, స్మరణం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం— అనునవి. ఇవన్నీ భక్తి మార్గాలు. గమనించినట్లయితే ఇవన్నీ ఒకటొకటిగా వరుసగా అలవడేవట్టికే. వినడంతో ప్రారంభమైన భక్తి భావం విస్తరించి ఆత్మ నివేదనంతో ముగుస్తుంది. అంటే ముక్తి- మోక్షంతో భక్తి మార్గ లక్ష్యం నెరవేరుతుంది.

భజన అనేది మనసా, వాచా, కర్మణా ఆచరించవలసినది. ఇది అసామాన్యులే కాదు, సామాన్యులు కూడా చేయు వీలయినట్టిది. దీనివలన సామాన్యులు, పామరులు కూడా తరించే అవకాశం వుంది.

అందువలన ప్రతివారూ భజనను చేయడం అంటే భజించడం అలవరచుకోనడం మంచిది, మేలైనది.

"మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనస వితృష్ణాం
యల్లభసే నిజ కర్మోపాత్తం
విత్తంతేన వినోదయ చిత్తమ్"

"ఓయీ మూర్ఖ మానవుడా! ధనాశను పూర్తిగా వదలిపెట్టు. కోరికలు లేకుండా చేసుకో! సద్బుద్ధి కలిగి మనసును నిర్మలం గావించుకో. అంతే!

నీ కర్మకు అనుగుణంగా ఏది అయితే ప్రాప్తిస్తుందో, ఏ ధనం లభిస్తుందో దానితోనే తృప్తిపడు.

   

కామం, క్రోధం, మదం, మాత్సర్యాలను లేదా వాటిని పెంపుదల చేసేది ధనం. అట్టి ధనాశను పూర్తిగా విడిచిపెట్ట మని, ఆదిశంకరులు ఉద్బోధిస్తున్నారు.

కోర్కెలు మానవ సహజం. అయితే కోరికలు సంతృప్తి పడుతున్నకొద్దీ అంటే తీరుతున్నకొద్దీ పెరుగుతాయి.

కోరికలు మనిషిని ఆలోచించేటట్లు చేశాయి. ఆధునిక యుగానికి మార్గం ఏర్పరచినాయి. ఇది నిజమే! అయితే మరొక నిజం కూడా వుంది. కోరికలు మనిషిని మనిషిలా ఉంచవు- ఉండనీయవు. నిలువనీయవు. ఈ కోరికలే మనిషిని రాక్షసుడిగా గావిస్తాయి. ఈ కారణాల వలన మనిషి కోర్కెలను చంపుకోవాలి. తనకున్న దానితో తృప్తిపడాలి. తృప్తి అనేది ముఖ్యం.

తృప్తి మరువడం, కోరికలను పెంచుకోవడం, ఆ కోరికలను సాధించుకోవడం కోసం ఏదేదో చేయడం, అందువలన బాధపడటం మూర్ఖత్వమే అవుతుంది.

ఈ శ్లోకంలో ధనాశను త్యజించమని అన్నారు ఆది శంకరులు. అంతేగాని ధనాన్ని ఆర్జించవద్దని మాత్రం అన లేదు. మనిషి జీవించాలి. జీవనానికి జీవితానికి ధనం అవ సరం. అందుకు ధనాన్ని ఆర్జించాలి. అవసరానికి మించిన ధనాన్ని ఆర్జించడం ఎందుకు?

చీకటి వున్నంతవరకే వెలుగు అవసరం కదా! దాహం వేసినపుడే కదా మంచినీటి అవసరం. దాహం తీరిన తర్వాత నీటి అవసరం లేదు కదా?

అదే విధంగా అవసరం వరకే అర్థం. అవసరం తీరే

వరకే ధనం. అవసరం తీరిన తర్వాత ధనం ఎందుకు? అ వంతమైన జీవితం అంటే అదే.

అంతేకాకుండా ముందు శ్లోకంలో చెప్పబోయే శ్లోక లకు ఈ శ్లోకం నాందీగా కూడా భావించవలసి వుంది.

"నారీ స్తన భర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశమ్
ఏ తన్మాంస వసాది వికారమ్
మనసి విచింతయ వారం వారం"

స్త్రీలను చూచి, వారి స్తన సౌందర్యాన్ని చూచి నాభిని గాంచి మోహావేశానికి లోను కావద్దు. నిజానికి యీ శరీరం ఇది మాంసం రక్తాలతో కూడినటిది. మనిషికి వినా శాన్ని కలిగించేదే! ఈ విషయాన్ని అనుక్షణం గుర్తుంచుకో

* * * *

ముందు శ్లోకంలో ధనం గురించి చెప్పిన ఆదిశంకరులు ఈ శ్లోకంలో స్త్రీని గురించి స్త్రీ వ్యామోహాన్ని గురించి ప్రస్తా విస్తున్నారు.

అనర్థాలన్నింటికీ మూలం కాంతా కనకాలు. రెండు మహా యుద్ధాలకు కారణం స్త్రీ. రామ రావణ యుద్ధానికి మూలం సీత. అలాగే మహాభారత యుద్ధానికి కారణం ద్రౌపది. ఇక ధనం విషయం చెప్పాలంటే ఉదాహరణలు కోకొల్లలు. ధనం కోసం, ధన సంపాదన కోసం మనుష్యులు ఏ స్థాయికి దిగజారిపోతున్నారో వేరుగా చెప్పనక్కరలేదు. ధన మూలం ఇదం జగత్ అన్న నానుడి ఉండనే వుంది.

అందుకనే ఆదిశంకరులవారు ఇంతకుముందు శ్లోకంలో ధనాశను వదలిపెట్టమని ఉద్బోధించారు. ఈ శ్లోకంలో స్త్రీ వ్యామోహాన్ని త్యజించమని ఉద్బోధిస్తున్నారు.

అయితే ఇది సృష్టి. సృష్టి వింత ఇది. ప్రకృతి పురుషుడు- మగ ఆడ ఒకరిపై ఒకరికి ఆకర్షణ ఉండటం సహజం. పైగా సృష్టి సైజం కూడా! అయితే ఎందులోనయినా, ఏ విషయంలోనయినా క్రమత, నిగ్రహం, కార్యక్రమ నిర్వహణలో పవిత్రత అవసరం అన్న విషయం ప్రతి ఒక్కరూ గమనించవలసి వుంది.

మనిషి అవయవ నిర్మాణం ఈ సందర్భంగా ప్రస్తావించవలసివుంది. అవయవ నిర్మాణానికి సంబంధించి స్త్రీ పురుషులలో తేడా వుంది. స్త్రీ పురుషుల అవయవాలలో చాలా భాగం ఒకటే ఒకే విధమయిన నిర్మాణమే! అయితే స్త్రీకి సంబంధించికొన్ని అవయవాల నిర్మాణం పొందిక ఆకర్షణ కలుగచేస్తున్నాయి.

ఏదీ ఏమయినా అవయవాలు అన్నీ ఒకటే ఎముకల గూడే! రక్తమాంసాదులతో కూడినట్టిదే.

ఇది తెలిసి కూడా; తెలిసిన విషయాన్ని మరచి మనిషి ఉన్మత్తుడు అవుతున్నాడు. ఉన్మాది అవుతున్నాడు. తోటి పురుగు కాలిపోవడం చూచి కూడా మరొక శలభం దీపంపై వాలిన విధంగా!

అట్టి వాటిపై మోహం పెంచుకోవడం ఎంతవరకూ సహజం— ఈ వ్యామోహం మనిషిని మనిషిగా వుండనీయడం లేదే—వ్యామోహితుడై యిచ్ఛవచ్చినరీతి వ్యవహరిస్తున్నాడే

కామాతురాణాం నభయం, నలజ్జా అన్న విషయం తెలిసినదే.

మనిషి కష్టజీవి. జీవనం కోసం జీవితం కోసం కష్ట పడాలి. ఆ కష్టం అంతా సుఖం కోసమే— సుఖపడాలన్న కోరిక అతన్ని కష్టపడేటట్లు చేస్తున్నది. అయితే అది ఎంత వరకూ- ఆ మమకారం వికారంలో పడితే ఎలా?

అందుకే ఆదిశంకరులు ఈ హెచ్చరిక చేశారు. వాస్తవము తెలియ చెప్పారు. మనిషికి జంతువుకుగల తేడాను గమనించమని ప్రబోధించారు.

నళినీదళ గత జలవతి తరలం
తద్వజ్జీవిత మతిశయ చపలం
విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం
లోకం శోక హతంచ సమస్తం”

తామరాకుమీద నీటిబొట్టు నిర్మలంగా మెరుస్తూ వుంటుంది. ఆ మెరుపు మెరిసినంత మాత్రం చేత శాశ్వతం అని అనుకోరాదు. అది అశాశ్వతమే ఈ లోకం అన్ని విధాలయిన రోగాలతోనూ, వ్యాధులతోనూ, సుఖం వలన రోగాలవలన కలిగే శోకంతో కూడినట్టిదే!

* * * *

ఈ జీవితం అనంతత్వంలో ఒక భాగం మాత్రమే— పరమాత్మ తత్వంలోని అంశమాత్రమే! అదే అద్వైతానికి పునాది. అహం బ్రహ్మా అన్నది. అందుకు సరైన ఉదాహరణ తామరాకుపై నీటి బొట్టు— అది ఎంతకాలం వుంటుంది క్షణికమే కదా! ఆ తర్వాత అనంత జలరాశిలో కలసి

ఈ జీవితం దుఃఖభాజకం. బాధల మయం. శోకాల నిలయం. రోగాల పుట్ట. బాధలతో జీర్ణించుకుపోయిన ఈ జీవితం గురించి, అశాశ్వత శరీరానికి లభించే క్షణిక సుఖాల గురించి ఎందుకు తాపత్రయపడటం—గోవిందుని భజించు. వాస్తవాలను అధ్యయనం చేయి. జీవితాన్ని అర్థం చేసికో.

"యావద్విత్తో పార్జన సక్తం
తావన్నిజ పరివారో రక్తం
పశ్చాజ్జీవతి జర్జరదేహే
వార్తాంకోపి నపృచ్ఛతి గేహే"

విత్తం సంపాదించినంత వరకే నీపై అందరికీ ఆసక్తి వుంటుంది. బంధువులు, మిత్రులు అంతా నీకోసం వస్తారు. ధనం సంపాదించినంత వరకే అందరికీ నీపై అభిమానం వుంటుంది. ఆ తర్వాత శరీరంలో జవసత్వాలు ఉడిగిన తర్వాత నిన్నెవరు గుర్తించరు. నీ ఉనికిని గమనించరు.

* * * *

కేవలం ధనార్జన ముఖ్యమైన అంశం కాదు. ధనం సంపాదించి తన వారికి యిచ్చినంత మాత్రంతో తన బాధ్యత తీరిపోయిందని అనుకోను వీలులేదు.

కేవలం ధనార్జనే జీవితం అని, అర్థం జీవిత పరమార్థం అని—అలా అనే అనుకుంటే అంతకంటే ఘోరమైన విషయం మరొకటి వుండదు.

కాగా శంకరులవారు ముందు శ్లోకాలలో హెచ్చరిం

చనే హెచ్చరించారు. ధనం ఆర్జించడం అవసరమే! కాని ధనాశ పనికిరాదు. దుఃఖానికి హేతువు అని.

నిజానికి ఈ ప్రాపంచిక జీవితంలో వ్యక్తి తాను సంపాదించినంత వరకే సముచిత గౌరవాన్ని పొందగలుగుతున్నాడు. జవసత్వాలు ఉడిగి ధనాన్ని ఆర్జించలేని సమయంలో అతనిని గూర్చి పట్టించుకొనేవారు వుండరు. ఇది వాస్తవ సత్యం.

అయితే మనిషి తాను సంపాదించే కాలంలో పొందిన గౌరవాన్నే జీవిత కాలం అంతా పొందుదామని అనుకుంటాడు. కాని అలా జరగడం లేదు. జరగదు. ఎందువల్లనంటే అతను సంపాదించే కాలంలో కేవలం అతని సంపాదనను గౌరవించారు కాని అతనిని మాత్రం కాదు.

ధనం కంటే ధన సంపాదన కంటే మించిన అర్థం, పరమార్థం. జీవిత సత్యం ఒకటున్నదన్న విషయాన్ని మనిషి గ్రహించవలసిన అవసరం ఎంతయినా వుంది. ఎంత త్వరగా గమనిస్తే అంత మంచిది.

"యావత్పవనో నివసతి దేహే
తావత్ పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహే పాయే
భార్యాభిభ్యతి తస్మిన్ కాయే"

నీవు బాగున్నంతవరకే అంతా నీ క్షేమ సమాచారాలు అడుగుతారు, శ్రద్ధ కనబరుస్తారు. ఈ దేహాన్ని నీవు విడిచిపెట్టిన తర్వాత ఎవరూ నీ గురించి పట్టించుకోరు.

ఆఖరుకు భార్య కూడా బిగ్రబిగుసుకుపోయిన నీ కాయాన్ని చూచి జడుసుకుంటుంది.

*  *  *  *

ఈ శ్లోకంలో కూడా శంకరులు అదే విషయాన్ని ప్రస్తావించారు. జీవించి వున్నంత కాలమే మనిషి జీవితానికి విలువ అని విశదీకరించారు.

మనిషిగా జన్మించక ముందు "నువ్వు" లేవు. చనిపోయిన తర్వాత కూడా "నువ్వు" లేనే లేవు. ఈ మధ్యకాలం చావుపుట్టుకల మధ్యగల స్వల్పకాలం- ఆ స్వల్ప జీవిత కాలంలో కొంతకాలం మనిషి జీవితంతో శారీరకంగానూ, భౌతికంగానూ, మానసికంగానూ కలసిపోయి సహజీవనం కొనసాగించిన భార్య కూడా- తీరా నువ్వు చనిపోయిన తరవాత- నీ భౌతిక శరీరాన్ని మరచిపోతుంది. గుమ్మం వద్దనే ఆగిపోతుంది. ఆ నిర్జీవ శరీరాన్ని చూచి కంపరం చెందుతుంది.

ఇది నిత్య జీవిత సత్యం. యుగాలుగా జరుగుతున్న సంభవం. అనునిత్యం అందరికీ అనుభవైక వేద్యం.

దీనిని, ఈ జీవిత సత్యాన్ని గమనించి జీవితంపై విరక్తి పెంచుకోమని అర్థంకాదు. ఏది ఎంతవరకూ అవసరమో అంతవరకే వినియోగించుకోవడం ధర్మం- విధి- చేయవలసిన పని.

అవసరానికి మించినది ఏదయినా వర్జ్యనీయమే కదా!

"బాలస్తావ త్క్రీడా సక్త
స్తరుణస్తావ త్తరుణీసక్తః
వృద్ధస్తావ చ్చిన్తా సక్తః
పరమే బ్రహ్మణికోపి నసక్త"

బాల్యాన్ని ఆటలయందు ఆసక్తితోనూ, యౌవన దశలో యుక్తవయస్సులయిన ఆడవారియందు అనురక్తితోనూ, వృద్ధాప్యాన్ని విచారంతోనూ గడుపుతూ ఉంటారు జనం సామాన్యంగా. పరబ్రహ్మం మీద ఎవరూ ఆసక్తి చూపరు కదా!

* * * * *

ఈ సకల చరాచర జీవరాశి ప్రకృతి ప్రసాదమే. ఇది పుణ్య ప్రవచనం కాదు. ఏదో మభ్యపరచడానికి చెప్పిన మాయ మాట కాదు.

ప్రాచీనులు చెప్పే ఈ విషయానికి ఆధునికులు చెప్పే డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతానికి తేడా ఏమీ లేదు.

జీవితాన్ని దశలుగా విభజించారు. జ్యోతిష్య శాస్త్ర రీత్యా దశలుగా స్థిరీకరించారు. నవగ్రహాల దశలు ఒక జీవిత కాలంగా నిర్ణయించబడింది. మనిషి పుట్టినరోజు వేడుకలు జరుపుకుంటాడు, ఘనంగా వేడుకగా. అయితే ఎవరూ గాని తాము ప్రతిక్షణం మృత్యువుకు చేరువ అవుతున్నామని ఎంచరు. ఇది కాలమహిమ అనాలో లేక మనిషి అజ్ఞానం అని అనాలో అర్థంకాని పరిస్థితే.

మనిషి జీవిత కాలంలో సగభాగం నిద్దురకే గడచిపో

తున్నది. మిగిలిన సగభాగంలో ఊహ తెలిసిన నాటినుంచి మనిషి తుచ్ఛమైన కోరికలతోనే కాలం గడుపుతున్నాడు. ఈ వయస్సులో వేదాంతం ఎందుకు అనుకుంటున్నాడు, పరబ్రహ్మ గురించి ఆలోచించడానికి సమయం ఎక్కడిది అని అనుకుంటూ జీవితం దుర్భరప్రాయం అని మనిషి తను జీవించే నాలుగు ఘడియలలోనూ కనీసం ఒక ఘడియ అయినా పరబ్రహ్మము గురించి ఆలోచించలేకపోతున్నాడు. ఇంతకంటే వింత అయిన విషయం మరింకేం వుంటుంది.

"కాతే కాంతా కస్తే పుత్రాః
సంసారో యమ తీవ విచిత్రః
కస్యత్వం వాకుత ఆయాతః
తత్వం చిన్తయ తదిహ భ్రాతః"

భార్య ఎవరు? పుత్రుడు ఎవరు? ఇలా ఆలోచిస్తే ఈ సంసారమే చాలా విచిత్రం. అసలు నీవు ఎవరు? నీ పుట్టుక ఎట్టిది? ఎక్కడ్నుంచి వచ్చావ్ ఒక్కసారి ఆలోచించు!

* * * *

నిజమే ఆలోచిస్తే ఏముంది? అంతా మిథ్య. భార్యా పుత్రులు అంతా విచిత్రంగానే గానవస్తుంది.

ఈ సంసారాన్ని గురించి, సంసారిక సుఖాలను గురించి ఆలోచించడం మొదలుపెడితే అంతా విచిత్రంగానే కనబడుతుంది. ఏదో స్వర్గ సౌఖ్యాలను అందించే తరువులాగానే కనబడుతుంది. అయితే ఈ విషయాన్ని గురించి తరచి తరచి

పరిశీలించి నట్లయితే సారం అనుకున్న సంసారం నిస్సారంగా నిస్తేజంగా తోస్తుంది. ఇది ఇందులోని రహస్యం.

ఇది ఇలా వుంచి చూచినట్లయితే శంకర భగవత్పాదుల సంబోధన ఈ శ్లోకంలో మారింది. గురువు శిష్యునికి ఉప దేశం చేస్తున్నట్లు ఇంతవరకూ కొనసాగిన శ్లోక పరంపర ఈ శ్లోకంతో మారింది. ఈ శ్లోకంలో సోదరా అని సంబో ధించారు. అంటే అన్నగారు తమ్మునికి చెప్పినట్లు.

కుటుంబం గాని కుటుంబ బాధ్యతలు గాని సామాజిక మయినవి వే! సుఖసంతోషాలకు నిలయమే! అయితే కార్య కారణ సంబంధాలనుబట్టి కలసి ప్రయాణం చేయాలి. అంత వరకే పరిమితం. కలసి చేసే ఈ ప్రయాణంలో ఎవరు ముందు ఎవరు వెనుక. అందువలన విపరీతమయిన మమతానురాగా లను పెంచుకొనడం మంచిది కాదు.

భార్య, భర్త కలసి జీవించాలి. ఈ కలసి పయనం ఆనందంగా వుండాలి. ఆరోగ్యప్రదంగా వుండాలి. మానసిక పరిపక్వతను పొందించేదిగా వుండాలి.

ఇదీ ఈ శ్లోకార్థం పరమార్థం

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం
నిశ్చలతత్వే జీవన్ముక్తిః

సత్ పురుషులతో స్నేహంవలన నిస్సంగత్వము, నిస్సంగత్వము వలన నిర్మోహత్వము, నిర్మోహత్వమువలన నిశ్చలతత్వము, నిశ్చలతత్వము వలన ముక్తి లభిస్తవి.

మంచివాడితో స్నేహం వలన ఒంటరితనం అలవడు తుంది. ఆలోచనా భావం కలుగుతుంది - దీనివలన విష యాసక్తి తగుతుంది. మమతలు అనురాగాలు అనుబంధాలపై కోరికలు లేనందువలన నిశ్చలత్వం లభించగలదు. దీని వలన ముక్తి లభిస్తుంది.

* * *

ముక్తి అంటే మోక్షం. ఐహికమయిన విషయాల నుంచి బయటపడటం అందరూ కోరేది యిదే. అని కోరు తూనే ఆ విషయలసత్వం నుంచి బయటపడలేక పోతున్నారు. అందువలన అందరూ పొందలేకపోతున్నారు. యిందుకు అన్నింటి కంటె ముఖ్యమైన అపూర్వమూ అనిర్వచనీయమూ అయిన నిశ్చలత్వము, నిశ్చలతత్వము కావాలి.

మనిషి, ఏ విధమయిన మమతానురాగాలను పెంచు కోకుండా వుండాలి. నిర్మోహిత్వం వలన నిశ్చలత లభి స్తుంది.

నేను ఎవరు? నా కర్తవ్యం ఏమిటి, అని ప్రతివ్యక్తి ఆలోచించిన రోజున, దేనికి అంటే ఏ వ్యామోహానికి లొంగని రోజున నిస్సాంగత్యం అలవడువుంది. యిందువలన విషయా సక్తి తగ్గుతుంది, నిశ్చలత లభిస్తుంది.

ఈ శ్లోకంలో సజ్జనులు అన్న పదం వుంది? సజ్జనులు అంటే ఎవరు? అర్థంకాని విషయం ఏమిటంటే ఎవరికి వారే తాము మాత్రమే సజ్జనులమని అనుకోవడం-ఎవరు పరబ్రహ్మ మందు ఆసక్తి చూపుతారో ఎవరు భగవత్ కృపకు పాత్రులు కాగలరో వారే సజ్జనులు

ఈ విధమయిన ప్రస్తావనే భగవద్గీతలో కూడా వుంది.
"క్రోధాద్భవతి సమ్మోహః మోహాత్ సస్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధి నాశాత్ ప్రణశ్యతి

-సాంగత్యం వలన కామము, కామం వలన క్రోధము, క్రోధం వలన సమ్మోహం, దానివలన స్మృతి విభ్రమం కలుగుతాయి. విభ్రమం వలన బుద్ధి నశిస్తుంది. బుద్ధి ఎప్పుడయితే నశిస్తుందో అప్పుడు నాశం తప్పదు.

*　　*　　*　　*

వయసిగతేకః కామవి కారః
శుష్కేనీరే కః కాసారః
క్షీణేతత్వే కః పరివారః
జ్ఞాతేవిత్తే కః సంసారః

నీరు ఎండిపోయిన తర్వాత యిక చెరు వేమిటి, వయసు ఉడిగిన తర్వాతయిక కామ వికారం ఏమిటి? ధనం తగ్గినపుడు పరివారం వుండదు-వీటిని గూర్చి జ్ఞానం గలవానికి ఇక సంసారం ఎక్కడిది?

*　　*　　*　　*

ఈ చిత్ర విచిత్ర ప్రపంచంలో అంతా రంగుల కలే- అన్నీ మనిషిని ప్రలోభపెట్టేవే! అంతా వింత. అన్నీ ఆకర్షణలే, యిట్టి వాటికి లొంగడం కేవలం అజ్ఞానం వల్లనే.

ఈ ఆకర్షణలకు దూరంగా వుండి,అజ్ఞానాన్నితొలగించి మనసును నిర్మలంగా నిశ్చలంగా వుంచుకోగలిగితే అంత

కంపే కావలసనది యింకేమి వుంటుంది. అప్పుడే జీవితం అన్నా జీవనం అన్నా అసలు విషయం అవగతమవుతుంది.

అసలు నిజాన్ని, సత్యం, సత్యస్వరూపాన్ని, పర బ్రహ్మ స్వరూపాన్ని పరబ్రహ్మతత్వాన్ని ఆ నిశ్చలత బోధ పరుస్తుంది. అది కరతాళామలకమయినపుడు, అట్టిమనిషికి ఈ సంసారంతోగాని, ఈ ప్రపంచంతోగాని ఎట్టి సంబంధం వుండదు.

యౌవన బిగిలోనే కామవికారం ఏర్పడుతుంది. ఆ యౌవనం గడిచినపుడు, శరీరంలోని జవసత్వాలుడిగిపోయిన తర్వాత యిక కామానికి, కామ వికారానికి చోటు ఎక్కడ?

అదే విధంగా అధికారం డాబు, దర్పం డబ్బు నీ వద్ద వున్నప్పుడే అంతా నీ చుట్టూ చేరుతారు. తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పది వేలు చేరు అన్న విధంగా, ఆ చెరువులో నీరు యింకిపోతే, ఎండిపోతే యిక కప్పలకు చోటెక్కడ

ఈ పరమార్థం గ్రహించవలసి వుంది గ్రహించగలిగిన వాడు జ్ఞాని అవుతాడు. సాక్షాత్తు భగవంతుడు తత్వమసి సోహం అర్థం అదే కదా!

మాకురు ధనజన యౌవన గర్వం
హరతినిమేష కాలం సర్వం
మాయామయ మిద మఖిలం బుధ్వా
బ్రహ్మపదం, త్వం ప్రవిశ విదిత్వాం!

"ధనం, పరివారం, యౌవనం వీటిని చూచి గర్వ పడకు ఇవి నీటిబుడగవంటివి. క్షణంలో హరించుకుపోతాయి"

ఐహిక విషయాలన్నీ మాయ. మాయాజాలంతో కూడినట్టివి. గ్రహించి మసలుకో బ్రహ్మపదం చేరుకొనే పథం కోసం ఆలోచించు.

*　　　*　　　*　　　*

ఈ ప్రపంచమంతా భ్రమ. భ్రమలో పడి జీవితాన్ని అంతం చేసికొనే శలభం కావద్దు. జీవితంను నాశనం చేసికో. వద్దు. నిన్ను నీవు మోసగించుకొనవద్దు. యిది ఆది శంకరుల వారి హెచ్చరిక

"నేను, నాది ఇవిస్వార్థానికి ప్రతీకలు. వీటిని వదల్చుకోవాలి ప్రతివారికీ కాస్తో కూస్తో స్వార్థం వుంటుంది. స్వార్థం వల్లనే మనిషి తన మనుగడసాగించగలుగుతున్నాడు బాధ్యలు గ్రహించగలుగుతున్నాడు. కొన్ని సామాజికబాధ్య తలు నిర్వహించ గలుగుతున్నాడు.

అయితే స్వార్థం కొంత వరకే పరిమితం కావాలి. మితిమీరితే ప్రమాదం హద్దుదాటితే ప్రమాదమేకదా

చంచలమయిన వాటిని అశాశ్వతమైన వాటిని శాశ్వతం అన్పించడం భ్రమించడమే, ఈ భ్రమ ఒక విధంగా తనను తాను మోసగించుకోవడమే! నిజానికి జీవితం బుద్బుద ప్రాయం. జీవితం శాశ్వతం అని అనుకోవడం నీటి బుడగను శాశ్వతంఅని ఎంచడమే! గడ్డిరపకను చూచి పాము అని భ్రమించినట్లు.

ధనము, యౌవనము, అధికారము. ఆశ్రిత సకల పరి వారం. యివన్నీ అశాశ్వతాలే! అవివేకాన్ని గూడు కట్టించేవే

క్షణంలో కోటీశ్వరుడయిన వాడిని, మరుక్షణంలో బిచ్చగా డయిన వాడిని మనం చూస్తూనే వున్నాం.

అందుచేత అశాశ్వతములయిన విషయాలను వదలి సత్యము, నిత్యము శాశ్వతము అయిన విషయాలపై దృష్టిని నిలుపు, చిత్తం నిలుపు, ముక్తి పొందు అని శంకరులు అంటున్నారు.

దినయామిన్యౌ సాయం ప్రాతః
శిశిరవసన్తే పునరాయాతః
కాలం క్రీడతి గచ్ఛత్యాయుః
తదపి న ముంచత్యాశావాయుః

పగలు రాత్రి, వెన్నెల చీకటి, ఉదయం సాయంత్రం, శిశిరం వసంతం వస్తూ వుంటాయి పోతూవుంటాయి. చక్ర నేమి క్రమేణ- ఇవన్నీ కాలభ్రమణంలో భాగమే. అయినా ఆశ మాత్రం చావడం లేదు.

• • • •

ఈ శ్లోకంలో ఆదిశంకరులు ఆశ ఎంతటి భయంకర మైనదో తెలిపారు. పగలు పోతుంది. రాత్రి వస్తోంది. తిరిగి పగలు ఇది క్రమం ఇలాగే చీకటి వెన్నెల, ఉదయం సాయం సాయంత్రం, కాలాలు, ఋతువులు ఆయనాలు—అంతా ఇంతే. వస్తూంటాయి. వెళ్తూ వుంటాయి. తిరిగి వస్తాయి.

అంటే వచ్చిపోయే విషయాలపై ఆశ పెంచుకోవడం ఎంతవరకూ సమంజసం—క్షణం గడుస్తున్నదంటే చావుకు దగ్గర పడుతున్నట్లే ఆయువు తీరుతున్నా ఆశ పెరుగు తోంది.

ఆశ అనేది చిత్తభ్రమ. చిత్తం అంటే మనసు. చంచల మయినది మనిషి వెళ్ళలేని చోటుకు వెళ్ళుతోంది. అంటే ఇదే. భ్రమే. ప్రతి దానినీ వూహించడం—ఆశించడం.

కాగా భ్రమకు లోనయిన మనిషి విచక్షణా జ్ఞానాన్ని పూర్తిగా కోల్పోతాడు. ద్రౌపది భ్రమకు లోనయ్యే అలభ్య మయిన సౌగంధిక పుష్పం కావాలని భీముని కోరింది. అంటే భ్రమ వలన కల్గిన ఆశకులోనై మాత్రమే.

కాగా సీత బంగారు లేడిని చూచి భ్రమించింది, కావా లని రాముని కోరింది. ఇది భ్రమ. సృష్టిలో బంగారు లేడి అనేదే ఉండదన్న విషయాన్ని మరచింది, ఫలితం అందరికీ తెలిసినదే మహాయుద్ధం.

ఆశ వదలు-ప్రతిక్షణాన్ని ఈక్షణామే విలువైనదని ఎంచుకొనవలసి వుంది, ప్రతిక్షణం- ఆ క్షణంలో సగమయినా భగవదారాధనలో గడుపు. కైవల్యపదం పొందమని అంటు న్నారు భగవత్పాదులు.

"కాతేకాన్తా ధనగతచిన్తా
వాతుల కింతవ నాస్తి నియంతా
త్రిజగతి సజ్జన సంగతిరేకా
భవతి భవార్ణవ తరణే నౌకాః"

కాంతను గురించి ధనాన్ని గురించి ఎందుకు ఆలో చిస్తావు. ఆ కాంత, ధనంతో సహా అన్నింటినీ నడిపించే ఆ భగవంతుని- ఈ సకల చరాచర ప్రకృతికిగల ఏకైక నియంతను గురించి ఎందుకు ఆలోచించవు? ఈ భవార్ణ వాన్ని దాటడానికి సత్పురుషుల సాంగత్యం తప్ప ఈ

ముల్లోకాలలో మరొకటి లేదన్న విషయాన్ని మరువడం ఎందుకని?

నిజమే! మనిషి ఏది దొరుకుతే అదే సర్వం అని ఎంచుతాడు. ఆ విషయాన్ని గురించే అతిగా ఆలోచిస్తాడు. ఆలోచన తప్ప అతనికి మిగిలేది ఏదీలేదు. వేదన తప్ప—ఆవేదన తప్ప.

మనిషి మానసికంగా తాత్వికంగా ఎదగవలసివుంది. అలా ఎదగలేనివాడు ఎందుకూ పనికిరాడు. అంటే మనిషి ఎప్పుడు కూడా మానసికంగా నీరస స్థితిని పొందరాదు.

అదే విధంగా మనిషికి ఎపుడూ నిశ్చలత అవసరం. నిగ్రహం అవసరం. నిగ్రహం వలన దేనినయినా సాధించవచ్చు.

ఇక్కడ సూక్ష్మాతి సూక్ష్మమయిన విషయం ఒకటున్నది చుట్టూ నీరు- ఆ నీటిపై తేలియాడే పడవ. ఆ నీరే లేకపోతే పడవ నిరుపయోగం. అయితే ఆ నీరే పడవలోనికి ప్రవహిస్తే ఆ పడవ ఉనికికే ప్రమాదం.

అదే విధంగా సంసారం- సంసారం మహా సాగరం— దుఃఖభాజనం అయినట్టిది. అయితే మనం ఆ సంసారంలో, సంసారంతో జీవిస్తున్నాం. మాంసం తింటున్నాం అని ఎముకలు మెడలో వేసికొనముగదా! ఆ సంసార మోహం, మోహ పాశాలను దరికి చేరనీయకుండా క్షేమదాయకం- ముక్తికి సోపానం.

"చతుర్దశ మంజరిక"

ఇప్పటివరకూ ఆదిశంకరులు చెప్పినవి. ఇప్పటినుంచి,

ఆ సమయంలో ఆయన వెంటగల శిష్యులు 14 మంది చెప్పినవి. వీటిని చతుర్దశ మంజరిక అని అంటారు. భాష నడక ఒకే మాదిరిగావున్నా భావస్ఫురణలో తేడా కానవస్తుంది.

"జటిలోముణ్డే లుంఛిత కేశం
కాషాయాంబర బహుకృత వేషం
పశ్యన్నపి చ నపశ్యతి మూఢః
ఉదర నిమిత్తం బహుకృత వేషం"

ఉదర నిమిత్తం బహుకృత వేషం. పొట్టకోసం పుట్టెడు తిప్పలు. ఒకరు కాషాయంబరదారి ఒకరు నున్నగా గుండు గీయించుకున్న వ్యక్తి ఒకరు స్వల్పంగా వెంట్రుకలు వుంచుకోగా మరి కొందరు జడలుకట్టిన జుట్టు గలవాడు వీరంతా మూఢులే-

(ఈ శ్లోకాన్ని శంకరుని శిష్యులలో పద్మపాదుడు చెప్పినది)

ఏదో వేషభాషలు మార్చినంత మాత్రం చేత ఏదో సాధించగలమని అనుకోవడం అవివేకం తాత్కాలికంగా కొంత సాధించినా అట్టిది క్షీణనాగరికతకు మూలం- యిటువంటి వాటి వలన మనిషి పాలికమైన నైతిక విలువలు పోగోట్టుకొని పతనావస్థ పొందుతున్నాడు.

జడలు పెంచుకొనో, జుట్టు గొరిగించుకొనో, పిలక మాత్రం వుంచుకొనో జ్ఞానులుగా భావించుకొంటున్నారు కొందరు అజ్ఞానులు. ఏదో చేద్దామని సాధిద్దామని తమను తాము మోసగించుకొంటున్నారు. ఇతరులను మోసగిస్తున్నారు. ఇటువంటి వారు ద్రోహులు. సమాజానికి చీడ పురుగులు.

ఇటువంటి వారివలన సాధించే మాట అటుంచి మొత్తం పవిత్రమైన లక్ష్యమే నాశనమవుతోంది. సత్యం సమాజానికి సుదూరమై అదృశ్యం అవుతున్నది.

ఈ విధంగా ప్రజల నమ్మకాలను ఆధారంగా చేసికొని బ్రతికే వారిని పద్మపాదుడు తీవ్రంగా గర్హించాడు.

"అంగం గలితం పలిత ముణ్డం
దశన విహీనం జాతం తుణ్డమ్.
వృద్ధోయతి గృహీత్వా దణ్డమ్
తదపిన ముంచతి ఆశా పిణ్డమ్.

(తోతకాచార్యులు చెప్పినది)

శరీరంలో జవసత్వాలు ఉడిగిపోయాయి. జుత్తు పండి పోయింది, రాలిపోయింది. పళ్ళు రాలిపోయాయి. నడువ లేక కర్ర వూతంతో నడుస్తున్నాడు. అయినా కోరికలను మాత్రం చంపుకోలేకపోతున్నాడు.

* * * *

అవును- నిజమే! పెళ్ళాడుతావా లేదా, పిల్ల కావాలా తాతా అని పండు ముసలిని అడుగుతే నాకెవరు పిల్లనిస్తారు నాయనా అని అంటాడుగాని వద్దని మాత్రం అనడు. ఇది నైజం- మానవ నైజం- విషయాసక్తికి గల బలం.

చిన్నతనంనుంచి చరమ దశవరకూ- కోరికలు, ఆశలు అనేవి పెరిగి పెద్దవి అవుతున్నాయే తప్ప, అవి తగ్గడంలేదు. మనిషి పరిణతి చెందిన తర్వాత లేదా పరిణతి చెందుతున్న తర్వాతకూడా ఏ విధం అయిన మార్పులేకుండా పోతున్నది.

ఇది విచిత్రమే. నిగ్రహాశక్తి, ఇంద్రియ నిగ్రహం అని అంతా అనే మాటే. అంటూ వున్న మాటే. అయితే అంతా

అవుతున్నాడో ఈ శ్లోకంలో వివరించబడింది. ముందు శ్లోకంలో సామాన్యుడు ఏ విధంగా బాధలకు గురి అవుతున్నాడో ఆశాపాశబద్ధుడై మనిషి ఎట్టిదుస్థితిలోవున్నాడో వివరింపబడింది

అందుకు భిన్నం ఈ శ్లోకం సర్వస్వాన్ని త్యజించి చెట్టు క్రింద నివసిస్తూ, భిక్షాటన వలన బ్రతుకుతూ కూడా కోర్కలకు వశం అవుతున్నాడు. ఆత్మజ్ఞానం లేకుండా కేవలం కాషాయ వస్త్రాలు ధరించి సన్యాసులమనుకునే వారికి యిది వర్తిస్తుంది.

సన్యాసం తీసికొని, సన్యాసి కాలేక, కోరికలు చంపుకోలేక అసలు ఈ సన్యాసం ఎందుకు గైకొన్నానా అన్న పునరాలోచన వల్లనో, లేక తాను కూడా జీవిస్తున్న తన చుట్టూరా వున్న సమాజంలో తన యీడువారు అనుభవిస్తున్న సుఖలను లేదా ఆనందాలను చూచినందున కలిగిన అసూయ వల్లనో ఇట్టిది సంభవించవచ్చు.

విషాన్ని అయినా ఔషధంగా సేవిస్తే గుణం ఇస్తుంది ఆ విషం అధికం అయితే ప్రాణాన్ని హరిస్తుంది. అదే విధంగా కోరికలు విసర్జిస్తే ఆత్మజ్ఞానం కలుగుతుంది. కనీసం అదుపులో వుంచుకొన్నా మేలు జరుగవచ్చు. కానీ పెంచుకున్న కోరికల వలన మనిషి అశాంతికి గురి అవుతున్నాడు.

"కురుతే గంగా సాగర గమనం
వ్రత పరిపాలన మథవా దానమ్
జ్ఞాన విహీనః సర్వమతేన
ముక్తిం నభజతి జన్మశతేన

(ఈ శ్లోకం సుబోధుడు చెప్పినది)

గంగా స్నానం చేసినా, సాగర స్నానం చేసినా వ్రతాలు ఎన్ని ఆచరించినా, దానధర్మాలు ఎన్ని చేసినా అజ్ఞానికి జ్ఞాన విహీనునికి ముక్తి లభించడం కడు దుర్లభం.

*   *   *   *

సర్వపాపాలను హరింప చేయగలదన్న గంగలో మునిగినా కోటి నదులు కడుపున దాచుకున్న సాగర స్నానం ఆచరించినా ఫలితం ఏమిటి- అదే విధంగా తీర్థయాత్రలు చేసినా ఏమిటి లాభం?

కేవలం శారీరకమయిన మెరుగులకు సంబంధించిన అంశాలు ఇవి. వీటివలన భౌతికమైన విశేషాలు, ఆరోగ్యం, క్రమత, క్రమశిక్షణ మొదలయిన మంచి అలవాట్లతోపాటు ఓర్మి వంటివి మనిషి సంపాదించుకోనవచ్చు. అంత మాత్రం చేత మోక్షప్రాప్తి కలుగుతుందని అనుకోవడం భ్రమమాత్రమే అవుతుంది.

మోక్ష ప్రాప్తికి ఎన్నో మార్గాలు - యివన్నీ కేవలం ఆధారాలు. ఈ మార్గాలనే మోక్షం అనుకుంటే ఎలా?

అందువలన ఈ మార్గాల ద్వారా ఆరోగ్యంగావుండాలి క్రమత పాటించాలి. క్రమ శిక్షణతో మెలగాలి సాధనచేయి. సాధనమున పనులు సమకూరు ధరలోన, అత్యుత్తమము అత్యంత దుర్లభము అయినమోక్షం సంపాదించేయత్నంచేయి.

సురమనిర్ద తరుమూల నివాసః
శయ్యా భూతల మజినం వాసః
సర్వపరిగ్రహ భోగత్యాగః
కస్య సుఖం నకరోతి విరాగః

(సురేశ్వరాచార్యులు ఈ శ్లోం చెప్పారు)

ఏ చెట్టుకిందో కాలం గడిపేయడం, భూమిమీాదనే పరుండటం, లేడి చర్మాన్నే ధరించడం, అన్ని భోగాలను త్యజించి, ఏ విధమైన వాటిని కోరని, వానికి అట్టి వానికి సుఖం ముక్తి ఎందుకు లభించదు.

* * * *

ఇందులో మోక్షమార్గాన్ని నిర్దేశించడం జరిగింది. సురేశ్వరాచార్యుల వారు చెప్పినవన్నీ సుబోధకాలే! లౌకిక మయిన విషయాసక్తిని విడిచిపెట్టిన వానికి, ఆ లౌకికమూ పారమార్థికమూ అయిన సుఖం ఎందుకు లభించదు?

నివాసమా! చెట్టునీడ జంతుచర్మం శరీరాన్ని కప్పు తోంది. ఆకలి బాధ తీర్చుకోవడానికి భిక్షాటన ఉండనే వుంది. లేదా ఆకో అలమో కందమూలాలో! ఏదో ఒకటి.

అట్టి వ్యక్తికి కావలసినదేమీ లేదు కదా...ఇహ లౌక విషయాలను కాదనుకున్న వానికి ముక్తిలభిస్తుందని దీనిభావం.

యోగ రతోవా భోగ రతోవా
సంగ రతోవా సంగ విహీనః
యస్యబ్రహ్మణి రమతేచిత్తం
నన్దతి, నన్దతి నన్దత్యేవా॥

(ఈ శ్లోకం చెప్పినది నిత్యానంద స్వామి)

యోగి కావచ్చు, భోగి కావచ్చు-సాంగత్యం ఉండ వచ్చు—లేకపోవచ్చు కాని ఎవరు బ్రహ్మమును మనసున నిలుపుకొనగలరో ఆనందానికి అర్హులు ఆనందిస్తారు - ఆనం దింపజేస్తారు. ఆనందాన్ని పంచి యిస్తారు

* * * *

భోగి అయినా యోగి అయినా, సత్ సాంగత్యం కలిగి వున్న వాడయినా "బ్రహ్మము"ను ఎవరు మనసునందు నిలుపుకొనగలరో వారే ఆనందం పొందగలరు అని అంటు న్నారు నిజమే! యోగి బ్రహ్మత్వాన్ని పొందుతాడు - విశ్వా మిత్రుడు ఎంతటి మహానుభావుడయినా మహర్షి మాత్రమే అయ్యాడు. బ్రహ్మర్షి మాత్రం కాలేకపోయాడు

యిక సాంగత్యం చూదామా, సాంగత్యం అన్నది మంచికీ చెడుకూ సోపానమే!

కాగా బ్రహ్మమును మనసునందు నిలుపుకొన్న ఆనందించగలడని, ఆనందం పంచి యివ్వగలడని ఒకరు చెప్పవలసిన అవసరం ఏముంది.

బ్రహ్మత్వం పొందినవాని జగమే ఆనందమయంకదా?

భగవద్గీతా కించి థధీతా
గంగాజల లవకణికా పేతా
సకృదపి యేన మురారి సమర్చా
క్రియతే తస్యయమేన నచర్చా॥

(ఆనందగిరి ఈ శ్లోకాన్ని చెప్పారు)

భగవద్గీతను ఏ మాత్రం చదివినా గంగా జలాన్ని ఒక్క చుక్క సేవించినా మురారిని ఒక్కసారి అర్చించినా అట్టివారికి యమునితో చర్చ అన్నది ఉండదు.

* * * *

లౌకికమయిన విషయం యిది. బ్రహ్మపదం పొంద డానికి సులభతరమయిన మార్గం యిది. ఈ శ్లోకంలో మోక్షం సులభ ప్రాప్తికి ముచ్చటగా మూడు మార్గాలు సూచింపబడ్డాయి అవి.

"భగవద్గీతను ఒక్కసారయినా పఠించడం

పరమపావని, పాపహారిణి అయిన గంగాజలాన్ని ఒక్కసారైన సేవించడం అదేవిధంగా మోక్షప్రదాతయగు మురారిని-మురారి అంటే మనిషికి శత్రువులయినఅరిషడ్వర్గాలను జయించగలవానిని-ఒక్కసారైనా అర్చించడం

చేసిన వారికి మోక్షం లభిస్తుంది.

మనుజులను కర్తవ్య పరాయణులుగా చేసేది భగవద్గీత మురారి మాత్రమే విషయలాలసతను అంతమొందింపచేయగల ధీశాలి లక్షలాది ఎకరాలను తన జలాలతో సస్యశ్యామలంచేసి పుడమితల్లికి పచ్చదనం చేకూర్చిపెట్టిన పావనిగంగ పూజ్యనీయమేగదా!

పునరపిజననం పునరపిమరణం
పునరపిజననీ జఠరేశయనమ్
ఇహసంసారే బహుదుస్తారే
కృపయా పారే పాహిమురారే!

(శంకరుల శిష్యులే చెప్పిన శ్లోకం-శిష్యనామం అలభ్యం)

**ఓ మురారీ—పుట్టడం గిట్టడం తిరిగి తల్లి గర్భాన పడటం వంటి వాటితో ఈ సంసార దుఃఖాన్ని దాటలేని మమ్ములను నీ అపారకరుణ కటాక్షణాల[illegible]బోచిరక్షించు.**

*    *    *    *

యిది సృష్టిక్రమం పుట్టడం పెరగడం గిట్టడం తిరిగి ఓ తల్లి గర్భాన పడటం తిరిగి జన్మించడం ఈ సంసార జంజాటంలో సహజసిద్ధమయినట్టివి. యిది చర్విత చర్వణం చక్రనేమిక్రమేణ ఇది జనన మరణాల చక్రం క్షణం క్షణం తిరుగుతూనే వుంటుంది.

మనిషి, తానుచేసిన పని యొక్క (కర్మ) ఫలితం మిగిలిపోయినప్పుడు మరో జన్మ తప్పనిసరి అవుతుంది. యిది అంతంలేనిది. యిలా కొనసాగిపోతూనే వుంటుంది.

అందుకే దీనిని మహాసాగరం అన్నారు. ఈది దరి చేరడం అసాధ్యమయిన విషయం. మానవ మాత్రుని వలన కాదు. యిందుకు భగవత్ ప్రేరణ అవసరం.

అందువలన జీవితంలో భగవధ్యానం అంతర్లీనం చేసికో! ఆ ధ్యానంలో కాలం గడుపు ధన్యుడవుకా!

రథ్యా చర్పట విరచిత కన్థః
పుణ్యా పుణ్య వివర్జిత పన్థః
యోగీ యోగ నియోజిత చిత్తః
రమతే బాలన్మత్త వదేవ

(ఈ శ్లోకాన్ని ఆనందుల వారు చెప్పారు)

పల్లెవాటుగా శాలువా వేసికొని, పాపపుణ్యాలకు అతీతమైన మార్గంలో యోగచిత్తంగల మనిషి పాలబుగ్గల పసివాని ఆనందం పొందుతాడు.

* * *

అందుకే అంటారేమో! పిల్లలు దేవుడు చల్లని వారని కల్లాకపటం తెలియని కరుణామయులని. అన్నింటి కంటే బాల్యం గొప్పది. సుఖమూ, దుఃఖమూ బాధ, వ్యధ తెలియని వయసు. పుట్టినపుడే- బట్ట లేకుండా పుట్టినపుడే సిగ్గుతెలియని వాడుగా లోకానికి పరిచయం అయ్యాడు. అదే విధంగా బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారం పొందిన వ్యక్తి అన్ని లౌకిక విషయాలను మరచిపోతాడు మీరా, చైతన్యప్రభు, రామకృష్ణ పరమహంస, ఈ తరంలో చెప్పుకోవాలంటే అంతర్జాతీయ

కృష్ణ సంఘం వంటి వారు ఎందరో.

అంటే- అసూయ ద్వేషం తెలియని చిన్నపిల్లవాని స్థితి అది. ప్రతి దానిని చూచి నవ్వి ఆనందంతో కేరింతలు కొట్టే వయసు అది. అదే విధంగా పిచ్చి. పిచ్చివానికి ప్రపంచం పట్టదు. తన లోకం తనది.

భగవద్భక్తి కూడా అట్టిదే. భగవత్ భక్తుడు కూడా బ్రహ్మజ్ఞాని కూడా అట్టివాడే. ప్రపంచంతో ఏ విధమయిన సంబంధమూ పెట్టుకోరు. తమ ధ్యాస తమది. తమ ఆలోచన తమది. తమ లోకం తమది. వారి ఆనందం వారిది. వారిలో వారే ఆనందిస్తారు. అదే బ్రహ్మానందం.

"కస్త్వం- కోహం కుత ఆయాతః
కామే జననీ కోమేతాతః
ఇతి పరిభావయ సర్వమసారం
విశ్వం త్యక్త్వా స్వప్న విచారమ్"

(యోగానందుల వారు చెప్పినది)

నేనెవరిని? నేను ఎక్కడనుంచి వచ్చాను? తండ్రి ఎవరు? తల్లి ఎవరు? నిస్సారమైన ఈ ప్రపంచాన్ని గురించి ఆలోచించడం మానివేయి.

*   *   *   *

నిజమే- ప్రతి వ్యక్తి నేను ఎవరు అని ఆలోచించవలసి వుంది. ఎందుకంటే మనం రంగుల ప్రపంచంలో వున్నాం కనుక- నిజం కాదా- కళ్ళు లేకపోతే కలియుగం లేదంటారు. అన్నీ వింతలే- అన్నీ చిత్రాలే! విచిత్రాలే- యిట్టి లోకంలో రంగుల కలవంటి జీవనం కొనసాగిస్తున్నాడు మనిషి. తను నివసిస్తున్న సమాజంలో తనతోపాటుగా నివసిస్తున్న వారందరి

తోనూ ఏదో ఒక విధమైన సంబంధుత్వం కలిగివుంటున్నాడు.

తల్లి తండ్రి తాత కొడుకు, కూతురు అల్లుడు కోడలు మిత్రుడు శత్రువు- ఎన్నో ఇలా- ఇవన్నీ కల్పితాలు- అశాశ్వితాలు కల్పించబడినట్టివి. మనిషి తనకు తానుగా కల్పించుకొన్నట్టి ఈ లంపటాలను దాటి ఆలోచించవలసి వుంది. అప్పుడే ఆత్మజ్ఞానం పొందడానికి మార్గం సుగమం అవుతుంది.

బ్రతుకులో వాస్తవికత వుంటుంది. స్వాప్నికత వుంటుంది. జీవితం శాశ్వతం, వాస్తవం. స్వప్నం అవాస్తవం, క్షణికం. నిదురలో సంభవించేది- నిద్ర భంగపడగానే కల కరిగిపోతుంది. జీవితమూ అంతే.

తామరాకుపై వున్నంతవరకే నీటిబొట్టు మెరుస్తుంది. తీరా ఆ నీటిబొట్టు తనచుట్టూగల అనంతజలరాశిలోకలసిపోతే!

అంతే! తర్వాత? జీవితమూ అంతే!!

త్వయిమయి చాన్య త్రైకో విష్ణుః
వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః
భవసమచిత్తః సర్వత్రత్వం
వాంఛ సచిరాద్యది విష్ణుత్వమ్

(ఈ శ్లోకం ఆనందులవారు చెప్పినది)

నీఎడల నాఎడల అన్ని ఎడల సర్వే సర్వత్రా ఉన్నది శ్రీ మహావిష్ణువే. ఈ విషయం తెలియకుండా ప్రవర్తించకు, వ్యవహరించకు. శ్రీ మహావిష్ణువు సాయుజ్యం త్వరగా లభించాలని ఎంచు- భావించు. లభించలేదని కోపగించకు. అందుకు అంటే ఆ విష్ణు సాయుజ్యాన్ని పొందాలని నీవు నిజంగా భావిస్తే-అందరి ఎడలా ఒకేమాదిరిగావర్తించు-ప్రవర్తించు!

* * * *

ఇది కేవలం శంకరుల వాణిగా, అద్వైత సిద్ధాంతానికి ప్రతీకగా మనం చెప్పుకోవచ్చు. నీవు నేను ఒకటే. నీవు వేరు నేను వేరు కాదు. నేనే నువ్వు. నీవే నేను. అంటే భగవంతుడు సర్వాంతర్యామి అని చెప్పడం- అన్నమాట. ఈ శ్లోకంలో విశ్లేషణ- విశేషం- అదే!

ఇది తెలియక చాలామంది అవివేకంతో కొట్టుమిట్టాడు తున్నారు. అహంబ్రహ్మ- తానే బ్రహ్మ స్వరూపాన్ని అన్న విషయాన్ని మరచిపోతున్నారు. ప్రతివారూ బ్రహ్మస్వరూపం అని ఎంచాలి. అంటే ప్రపంచంలో ప్రతి జీవిపై ప్రతి వస్తువుపై సమదృష్టి కలవాడు భగవంతుడు. అదే విధంగా మనిషి తాను భగవంతునిగా ఎంచి ఆ సమదృష్టిని అలవరచుకోన వలసివుంది. ఆ సమదృష్టి కొరవడిన వ్యక్తి అజ్ఞాని- అవివేకి.

తెలియనివారు ఏదో వాగినంత మాత్రాన నిజందాగదు కదా! అరచేతిని అడ్డంపెట్టి సూర్యకాంతిని ఆపగలమా?

శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ
మాకురు యత్నం విగ్రవసన్ధౌ
సర్వస్మిన్నపి పశ్యాత్మానం
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానం

(చంద్రశేఖరులవారు చెప్పిన శ్లోకం)

విరోధి, స్నేహితుడు, పుత్రుడు, బంధువు వీరందరి యెడల ఒకే భావం కలిగివుండు. వారినుంచి వేరు పడడానికో దూరంగా ఉండడానికో, రాజీపడిపోయి అణగి మణిగి ఉండటానికో యత్నం చెయకు.

* * * *

అన్నీ తానే అయినపుడు నీనా భేదాలు ఎందుకు? తరతమ భేదాలు ఎందుకు? యివన్నీ అజ్ఞానంవలన ఏర్పడి నట్టివే. వీటిని వదలిపెట్టు—అంటే అజ్ఞానాన్ని అవివేకాన్ని వదలిపెట్టమని

తాను ఎలాగో అంతా అలాగే. అందరూ అలాగే అని ఎంచినవాడు జ్ఞాని. తనయందు తన వారియందు ఎంత మమ కారం వుంటుందో, తన కోసం, తన శరీరం కోసం మనిషి ఎంత తాపత్రయ పడతాడో యితరుల ఎడ అలాగే వర్తించిన వాడే. యితరుల ఎడ యితరుల కోసం అలా తాపత్రాయపడ్డ వాడే పరిపూర్ణుడు కాగలుగుతాడు.

జగత్తు ఆనందమయం. ఈ ఆనందం ప్రేమవలన సిద్ధి స్తుంది. విశ్వప్రేమ అంటే నిర్వ్యాజమైన మహాంబుధి విశ్వ జనీనమయిన ప్రేమతో దేనినయినా జయించవచ్చు.

ఇది అలవరచుకొన్నవారికి లోకంతో పనేముంది. జయిం చవలసినది ఇంకేముంటుంది. అంతా కరతలామలకమే కదా!

కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాత్మానం పశ్యతి సోహం
ఆత్మజ్ఞాన విహీనామూఢాః
తే పచ్యన్తే నరకని గూఢాః

(భారతీవంశ చెప్పిన శ్లోకం ఇది)

కామాన్ని క్రోధాన్ని మోహాన్ని లోభాన్ని వదలి పెట్టినవాడు తానెవరో తెలుసుకోగలుగుతాడు. దానితో పాటుగా తనలోవున్న వాడిని గూర్చి తెలుసుకొంటాడు.

ఇది తెలుసుకోలేనివారు మూర్ఖులే. ఆత్మజ్ఞానం లేనివారే నరకాన్ని అనుభవిస్తారు.

*　　*　　*　　*

అవును నిజం. కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలను వదలి పెట్టినట్లయితే అట్టి వ్యక్తి ఆత్మజ్ఞానం పొందగలుగుతాడు. ఆత్మజ్ఞాని పొందలేనిదంటూ ఏదీ ఉండదు గదా!

తనను గూర్చి తాను పూర్తిగా తెలిసికొన్న మనిషి, తనలో నిబిడీకృతమయిన అంతర్లీనమైయున్న శక్తిని తెలుసుకో గలుగుతాడు సోహం అంటే యిదే. అద్వైత సిద్ధాంతానికి మూలం ఇదే. సోహం వాడే నేను.

లౌకికమయిన తుచ్ఛమైన కోరికలను వదలినపుడుగాని మానవుడు తనలోని మాధవుడ్ని గాంచలేడు. మాధవుడ్ని దర్శించగల ఆత్మజ్ఞానం కోరికలను ఇహలోక వాంఛలను వదలినగాని లభించదు.

ఆత్మజ్ఞానం కొరవడిన వానికి తప్పదు నరకం— ఎప్పుడో ఎక్కడో నరకం అనుభవించడం కాదు- తన అజ్ఞానానికి మనిషి తన జీవిత కాలంలోనే ఫలితం అనుభవిస్తాడు.

గేయం గీతానామ సహస్రం
ధ్యేయం శ్రీపతి రూపమజస్రం
నేయం సజ్జన సంగేచిత్తం
దేయం దీనజనాయచ విత్తమ్.

(సుమతి చెప్పిన శ్లోకం ఇది)

భగవద్గీతను గానం చేయడం విష్ణునామ సహస్రాన్ని జపించడం శ్రీమహావిష్ణువును చిత్తమందు నిలపడం సజ్జనుల

సాంగత్యం కోసం మనసును ప్రోత్సాహించడం దీన జను లకు దానం చేయడం ఇవి ముఖ్యం.

* * * *

అధ్యాత్మిక మార్గంలో సద్వర్తనునిగా పరిశుద్ధునిగా జీవించాలనుకున్న మనిషి సులభతరమైన నాలుగు మార్గాలను సుమతి చెపుతున్నాడు. అవి భగవద్గీత పారాయణ.

విష్ణునామ సహస్రాన్ని జపించడం, మనసావాచా కర్మణా శ్రీమన్నారాయణమూర్తిని సేవించడం.

ఉత్తములు సద్వర్తనులు అయిన వారి స్నేహాన్ని. సాన్నిహిత్యాన్ని పెంపొందించుకొనడం.

శక్తివంచన లేకుండా దీనజనులకు సాయం చేయడం

ఎన్ని మణులున్నా సూత్రం ఒకటే! ఎన్ని నీతులు చెప్పినా ధర్మపన్నాలు వల్లించినా ఎవరయినా చెప్పేది బోధించేది ఆత్మజ్ఞానాన్ని అలవరచుకోమనే! సుమతి చెప్పి నదీ అదే.

పరిణామక్రమంలో మనిషి ఎలా పరిణతి చెందాడో అదే విధంగా క్రమ పరిణామంలో మనిషి పరిపక్వం చెందాలి పరిపూర్ణత నొందాలి. అందుకే ఒక క్రమంగా మన ముందుం చాడు సుమతి,

* * * *

ఈ చివరి నాలుగు శ్లోకాలు శంకరులు చెప్పారు. తన నిర్దేశిత అద్వైత మార్గాన్ని సూటిగా చెప్పారు.

సుఖతః క్రమతే రామా భోగః
పశ్చాద్ధన్త శరీరే రోగః

యుద్వ్యాపిలోకే మరణం శరణం
తదపినముంచతి పాపాచరణమ్

తాత్కాలికము తుచ్ఛము అయిన భోగాలను సుఖాలను ఆశించి మనిషి శరీరానికి రోగాలు కొనితెచ్చుకుంటున్నాడు. లోకంలో మరణమే చివరిది అని తెలిసినప్పటికీ పాపపు పనులు చేయడం మాత్రం మనిషి మానడంలేదు.

* * * *

పధ్నాలుగుమంది శిష్యులు తలా ఒక శ్లోకం చెప్పిన తరువాత ఈ చివరి నాలుగు శ్లోకాలు శంకరులవారు చెప్పారు విమర్శనాత్మకంగావున్నా ఆయన ఎంతో ఆవేదనతో చెప్పినట్లుగా ద్యోతక మవుతాయి. మార్గనిర్దేశకంగా గోచరిస్తాయి.

* * * *

సుఖం అనేది క్షణికం అని చంచలం అని తెలుసు. తెలిసి కూడా మనిషి ఆ సుఖ భోగాల వలయంలో పడి కొట్టుకుంటున్నాడు యింద్రియలాల సత్యాన్ని పశుప్రవృత్తిని పెంచుకుంటున్నాడు. పశువులా ప్రవర్తిస్తున్నాడు. కనాకష్టంగా నికృష్టంగా జీవిస్తున్నాడు.

సుఖం-దానిని కోరిన మనిషిని మనిషిగా వుండనీయదు మనిషిని రాక్షసుని చేస్తుంది—అని తెలిసి కూడా అజ్ఞానంగా ప్రవర్తిస్తున్నాడు

జాతస్య మరణం ధృవం-మరణం ప్రాణికి తప్పదు. అని తెలిసి జీవిత భ్రమలో పడుతున్నాడు మనిషి. ప్రతిదీ వూగిసలాటగానే కానవస్తుంది. ఈ రంగుల వలనుంచితప్పించుకొన్నవాడు ధన్యుడు

కాని మనిషి పాపంవల్లనే తాను మరణానికి చేరువ

అవుతున్నానని తెలిసి కూడా పాపకార్యాలు చేస్తున్నాడు.

అర్థమనర్థం భావయనిత్యం
నాస్తి తతః సుఖలేశః సత్యం
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితారీతిః

"అర్థం అంటే ధనం. అన్ని అనర్థాలకు మూలం. అందువలన సుఖం సంతోషం మృగ్యం అవుతాయి. ఆఖరుకు కన్న బిడ్డలవలన కూడా భయపడవలసి వుంది. సంపాదించిన ధన సంరక్షణ కోసం పడరానిపాట్లు పడుతున్నాడు మనిషి.

*   *   *   *

ఇంద్రియలాల సతకు మనిషి లోను అవుతున్నాడో పతనం అవుతున్నాడో అదే విధంగా అర్థం వలన మనిషి అనర్థాలనుకొని తెచ్చుకుంటున్నాడు.

ధనం ఎంత పాపిష్టిదో మానవత్వపు ఔన్నత్యాన్ని మానవత్వపు విలువలను ఎలా నశింపచేస్తున్నదో యిందులో వివరించారు శంకరులు.

డబ్బు సంపాదనలో మనిషికి విశ్రాంతి వుండదు-సుఖం వుండదు-ఎవరినీ నమ్మలేడు—ఆ ధన సంరక్షణతోనే కాలం గడిచిపోతున్నది. ధనాన్ని తాను సంపాదించిన విధం మరచి, ధనమే తనను సంపాదించినట్లుగా ప్రవర్తిస్తున్నాడు.

యిది గమనించి మెసులుకో—మసలుకో అని ఆది శంకరులవారు హెచ్చరిస్తున్నారు.

ప్రాణాయామం ప్రత్యాహారమ్
నిత్యానిత్య వివేకవిచారమ్

జాప్యసమేత సమాధి విధానం
కుర్వవధాన మహదవధానం.

ప్రాణాయామంతో ప్రత్యాహారం పొందు - ఇంద్రియాలను జయించు ఆకాంక్షలను విడనాడు—ఏది నిత్యం—ఏది నిత్యం అన్న వివేకాన్ని పరిశీలనను అలవరచుకో సమాధి అవస్థను గాంచు మహాదవధానాన్ని పొందు

*　　*　　*　　*

ఈ శ్లోకంలో శంకరుల వారు ముక్తి మార్గాన్ని ఉపదేశిస్తున్నారు-కాంతా కనకాల వలన గలిగే అనర్థాలను గూర్చి చెప్పిన శంకరులవారు ముక్తి మార్గాన్నివివరిస్తున్నారు.

ప్రాణాయామం, ప్రత్యాహారం, జాప్యసమేతం సమాధి విధానం గురించి వివరించారు. ఇవి క్రమానుగతం ఒక దాని తర్వాత ఒకదానిని అలవరచుకొనవలసి వుంది. వీటిసాయంతో ముక్తిని పొందు

ప్రాణాయామం—ఇది క్రమశిక్షణతో కూడిన క్లిష్టమయిన వ్యాయామం మనిషికి ప్రాణావసరమైన వాయువును అదుపులో వుంచడం, వాయువులో అంతర్లీనమైన, అత్యంత శక్తివంతమైన ధార్మికశక్తిని అదుపులో వుంచుకొనగలగడం.

కేవలం వాయువును అదుపులో ఉంచుకొనే వ్యాయామం వరకే పరిమితం అనుకోరాదు. యిది అపరిమితం.

ప్రధానమయిన వాయువులు అయిదు. ప్రాణవాయువు ఉదానవాయువు, సమానవాయువు, వ్యానవాయువు, అపానవాయువు ఈ అయిదింటిని అదుపులో వుంచుకోవడమే ప్రాణాయామం.

ఇక ప్రత్యాహారం ఇంద్రియ చాపల్యాన్ని నిర్మూలించు కోవడం, ఇంద్రియాలను అదుపులో వుంచుకొని కోరికలను అదుపులో వుంచుకొని, యింద్రియలాలసతకు అతీతంగా వ్యవహరించడం.

మూడవది నిత్యానిత్య వివేక విధానం ఏది నిత్యం ఏది అనిత్యం అన్నది గ్రహించడం-యిందుకే మనిషి విజ్ఞత ఆధారపడి వుంటుంది. ఏది అనిత్యం. ఏదినిత్యం. ఏది సత్యం ఏద సత్యం, ఏది శాశ్వతం ఏద శాశ్వతం. యిది గ్రహించ గలిగితే కానిది ఏముంది తరువాత విషయం జాప్యసమేత సమాధి. జపంతో కూడిన ఏకాగ్రత జపం అన్నది నిత్యం క్రమం తప్పక ఆచరించే శిక్షణా యుతచర్య తనకున్న మేధను ఒక క్రమతకు తీసికొని వెళ్ళడం ఆలోచనలను క్రమ బద్ధం చేసి ఒకే విషయంపై దృష్టి నిలపడం

యిటువంటి ఆలోచనా రహితమైన స్థితి వలనఏకాగ్రత ఏకాగ్రతవలన భగవత్ సాక్షాత్కారం లభిస్తాయి.

గురుచరణాంబుజ నిర్భరభక్తః
సంసారాదచిరాద్భవ ముక్తః
సేంద్రియ మానస నియామాదేవం
ద్రక్షసి నిజహృదయస్థం దేవమ్!

గురుపాదారవిందాల ఎడ అనితర భక్తి శ్రద్ధలు గల మనిషీ! ఈ దుఃఖ భాజనమైన సంసార సాగరం నుండి విముక్తి నొందెదవు గాక! ఇంద్రియాలను జయించి భవ బంధాలను త్రెంచుకొని విముక్తి నొందెదవు గాక. నీ

హృదయంలోనే పరమాత్మ సాక్షాత్కారం పొందెద
గాక

* * * *

ఈ భజగోవింద శ్లోకాలను పఠించే వారికి, శ్లోకాల
ఉపదేశించ విధంగా వ్యవహరించి ఆత్మయందే పరమాత్మ
సాక్షాత్కారం పొందమని ఆశీస్సులనందజేస్తున్నారు ఆ
శంకరులవారు.

యిక్కడ గురువు అంటే నమ్మిక—నమ్మిక అనేది
అజేయమైనది. అనంతశక్తిని ప్రసాదించేది నమ్మిక విశ్వాస
లభింపచేస్తుంది.

గోవింద అని శంకరులు అంటారా కొందరి శంక—
దేవుడు ఒక్కడే అని అనుకుంటే చాలదా. కాగా గోవు
అంటే పవిత్రత మొదలుగాగల అనేక అర్థాలున్నాయి.
అన్నింటికి మించి ఆదిశంకరుల వారి గురువులు శ్రీగోవిందా
చార్యుల వారు అందుకే భజగోవిందం అన్న మకుటంతో
శ్లోకాలు చెప్పారు.

అంచలమైన భక్తి విశ్వాసాలతో గురువును నమ్మిన
వారు కనుకనే ఆదిశంకరులవారు అనంత పథగాములు
కాగలిగారు.

॥ శుభమ్ ॥